శ్రీరస్తు.

శ్రీ

# వేంకటేశ్వరశతకము.

గ్రంథకర్త

విద్వాన్

మంథా రాయుఁడుశాస్త్రి

ఏ. వి. యన్. కాలేజి యాంధ్రోపాధ్యాయుఁడు

విశాఖపట్టణము.

ఇది

శ్రీశారదాముకుట ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడి

ప్రచురింపఁబడియె.

మొదటికూర్పు.

కాపీరైటు.] [వెల 0-3-0.

# విజ్ఞప్తి.

అంధ్రభాషాభిమానులారా!

వైశాఖమండలంబున విరాజిల్లు విజయనగరం సంస్థానంబుననుండు కళ్ళేపల్లి యను నగ్రహారంబస్మన్నివాసస్థలంబై తనరారుచుండు. కొట్టామను నగ్రహారంబుననుండు స్థానికోన్నత ప్రాథమిక పాఠశాలయందు నేనాంధ్రోపాధ్యాయుఁడనుగా నుండు సమయంబున నొక్కనాడు మన్మిత్రబృందముతోఁ గూడి తద్గ్రామోపాంతస్థగోస్తనీ నదీతీరంబున కేగి తత్తీరంబుననుండు నతిరమణీయంబగు నారామంబునఁ బ్రవేశించి యందు సాంద్రతరుచ్ఛాయాశీతలంబగు నొక సికతాతలంబునఁ గూర్చుండి నానావిధప్రసూనసౌరభసమన్వితంబులగు మందసమీరణంబులోలయ నతికుతుకంబున సంభాషించుచుండఁ బ్రసంగవశంబున నస్మత్సహోపాధ్యాయులగు సాగి జగన్నాథరాజుగారు నన్నుంగాంచి నీతిబోధకమగు నొక శతకంబునురచించి మాకానందంబొనగూర్పుఁడని నుడివిరి. అంత నేనారాజన్యుని వాక్కులకెంతయు సంతసించి భాషాసేవ నొనర్చుట యుచితంబని తలంచి కొన్ని గ్రంథరాజములలోని నీతులను సంగ్రహించియొకశతకంబును రచించి వేంకటేశ్వరాభిధానంబును మకుటముగనుంచి దానిని దిరుపతి వేంకటేశ్వరున కంకితముగ నొనంగి మన్మిత్రులకు వినిపి ప వారానందించిరి. భాషాభిమానులరగు మీరు దీనిని నాదరింతురుగాక.

| | |
|---|---|
| విశాఖపట్టణము, 9-12-34. | ఇట్లు బుధజనవిధేయుఁడు, విద్వాన్ మంథా రాయుఁడుశాస్త్రి. |




ఉ॥ శ్రీసురశైలధీరు నిజ • సేవకచాతక నీలకంధరున్
భాసురమాని హృద్వనజ • భాస్కరుసంస్తుత సద్గుణాకరున్
దానకదంబకోత్పల సు • ధాకరుఁదిరుపతి వేంకటేశ్వరున్
నే సతతంబు భక్తినతి • నిర్మల చిత్తుఁడనై స్మరించెదన్॥




మ॥ వినుతాశేషసుశబ్దశాస్త్రవిదునిన్ • విఖ్యాతతర్కజ్ఞునిన్
ఘనసద్వ్యజ్ఞులవంశ సాగరవిధున్ • ఖ్యాతాంధ్రభాషానిధిన్
ధనసౌశీల్యశమాదియుక్తుఁడిన సీ • తారామ సత్పండితున్
బ్రణతుల్ సేయుచు నేను మద్గురువరున్ • బ్రార్థింతు నశ్రాంత
మున్॥




చ॥ నిరుపమసూనృత వ్రతకు • నిర్మలచిత్తకు నీతిసక్తకున్
హరిచరితానురక్తకు న • హర్నిశసంస్తుత శీలయుక్తకుం
బరమగుణప్రసక్తకును • మజ్జనయిత్రికిఁ బార్వతమ్మకున్
గరములుమోడ్చి మ్రొక్కెద వి • కాసమునన్కడనైయజస్ర
మున్॥




చ॥ అనవరతాబ్జనాభ చరి • తాదరుసూనృత వాక్యతత్పరు
న్ఘననిజవంశ ధర్మరతు • న్యాయగుణాన్వితునిందపోనిధి
స్వనయదయాదిసద్గుణుని • నిష్కలుషాత్ముని సచ్ఛ్రితు మ
జ్జనకుని బార్వతీశు నని • శంబు స్మరించెద నామనంబునన్॥



శ్రీ

# వేంకటేశ్వరశతకము.



శ్రీకరసత్వమానుష వ
శీకరసంస్తుత సద్గుణౌఘ ర
త్నాకర భక్తలోక కుము
దాళి నిశాకర సేవకౌఘ శో
భాకర యాశ్రితాంబుజ ది
వాకరమర్దిత కాళియాఖ్య ద
ర్వీకర నీకు మ్రొక్కెదను వేడుకఁ
దిర్పతి వేంకటేశ్వరా॥ 1

చ॥ సుగుణపరీతుఁ డొక్కరుఁడె ♦ సూనుఁడు చాలుఁ గులంబుఁ
బెంపఁగాఁ। బాగడితలేని నూఱుగురు ♦ పుత్రులు గల్గిన నే
మి లాభమా। నిగనిగ ప్రజ్వరిల్లుటకు ♦ నిర్మల రత్నము చా
లుఁ గాంతిలే। ని గులకఱాలు నూఱయిన ♦ నేర్చునె రంజిల
వేంకటేశ్వరా॥ 2

చ॥ పదుగురుగూడి యేకమయి ♦ పంతములాడు మహాబలా
ఢ్యునిం। గదిసి బిఱానఁ బట్టుకొని ♦ కట్టఁగవచ్చును నిక్కువం
బుగా। ముదము వహించుచుంగటికి ♦ పోచలవన్నియు నొ
క్కటా త్రాడుగాఁ। గదిసి మదేభరాజమును ♦ గట్టఁగఁ జాలవె
వేంకటేశ్వరా॥ 3

చ॥ కలుషవిహీనచిత్తునకుఁ ♦ గాంక్షను జెప్పినవిద్య యెంత
యో । సులువుగ వచ్చుచుండుఘన ♦ శోభవహించుచు నం
తకంతకున్ । దెలుపుగనున్న వస్త్రమునఁ ♦ దేటగునెఱ్ఱని రం
గు వేసినన్ । బలముగనద్దిదానికిని ♦ బట్టుకయుండునె వేంకటే
శ్వరా॥ 4

చ॥ వలనగు వేళలన్నరుఁడు ♦ పట్టుగయత్నముచేయకున్నఁగా।
వలసిన వస్తువెప్పుడును ♦ వానికిఁజిక్కదు తథ్యమేసుమీ।
యలసతనిద్రఁ జెందుసమ ♦ యంబున సింహమునోట జం
తువుల్ । చెలఁగితమంతఁదాముపడఁ ♦ జేరునె చెప్పుమా వేంక
టేశ్వరా॥ 5

చ॥ పనివడిదుర్గుణుంగలసి ♦ పాయకయుండిన సజ్జనుండుతా। వె
నుకటి సద్గుణంబులను ♦ వీడివహించును దుర్గుణంబులన్।
వననిధిఁ జేరియుండిన స్ర ♦ వంతులుమాధురివీడి పూర్తిగా।
నొనరఁగఁ దాల్పలేదెకదు ♦ నుప్పఁదనంబును వేంకటే
శ్వరా॥ 6

చ॥ నరపతికోల్వుకూటమున ♦ న్యాయమొసంగని దుష్టులున్న
నా।ధరణిపుఁ జేరరెవ్వరును ♦ దప్పకకీడగునన్న భీతిచే। గురు
తరగంధవృక్షమును ♦ గ్రూరభుజంగముచుట్టియున్ననా । స
రసకుఁ బోవునయ్యెజన ♦ సంతతులెన్నఁడు వేంకటేశ్వరా॥ 7

చ॥ తొలఁగక సజ్జనుండెపుడు ♦ దుర్జనసంఘముఁ జేరినన్విపత్తు
లనతఁడొందు నాతనిని ♦ దుర్జనుఁడందురు లోకులెల్ల స్వ।

స్థలమునువీడి హంసబక ♦ సంఘములోపలఁ జేరియుండి
నన్। దెలియక కొక్కెరందురు గ ♦ దే జనులందఱు వేంక
టేశ్వరా॥ 8

ఉ॥ పండితవర్య సన్నిధి న ♦ పండితులందఱుఁ గాంతిహీనులై ।
యుండుట నిక్కువంబు కదు ♦ సత్తమవిద్యను సంగ్రహిం
పమిన్ । నిండుగనుండునట్టి రజ ♦ నీపతి చెంతను గాంతిలేక
యే । యుండవె తారకాగణము ♦ లూర్జితసద్గుణ వేంకటే
శ్వరా॥ 9

చ॥ మనమున జంక లేక యభి ♦ మానముతోడ నరుండు జోలి
మా । లిన పని కేగినట్లయిన ♦ లిప్పకులోపల నేనశించు మం।
తనమును వీడువానరము ♦ దారువుమధ్య బాతి పెట్టు మే।
కునువడి నూడఁగాఁ బెఱికి ♦ కూలదె యోలుచు వేంకటే॥ 10

ఉ॥ ఆశయు నెంత ప్రాప్తమగు ♦ నంతె లభించునుగాని భ్రాంతి చే।
మేరువుఁ జేరఁబోయినను ♦ మెండుగఁజిక్కదు ద్రవ్యమె
న్నడున్। వారిధిలోపలన్ ఘటము ♦ బాగగముంచిన నంత
కంటెఁ ద । న్నీరముదానిలోనిముడ ♦ నేర్చునె చెప్పుమ
వేంకటేశ్వరా॥ 11

ఉ॥ కష్టములెన్ని వచ్చినను ♦ గాంతను బుత్రిని వీడియున్న
నా। కష్టములన్ని మోర్చి కల ♦ కాలము సత్యముపల్క శ్రే
యమహాఁ । గష్టములాత్రిశంకు సుతుఁ ♦ గాఱియ పెట్టినఁ బు

తుఁ ద్రెళ్లినన్। భ్రష్టపడుండు తానయినఁ ♦ బల్కఁడె సత్య
ము వేంకటేశ్వరా॥ 12

చ॥ పరసతిబల్మినింగవయు ♦ భావముగల్గిన దుర్మదాంధుఁడా।
నరుఁడపకీర్తితోడు గను ♦ నాశనమొందుట నిక్కమేసు
మీ। దురితయుతుండు కీచకుఁడు ♦ ద్రోవదినింజెఱఁబెట్టఁ
బోయి తా। నరయక దిక్కులేక ప్రళ ♦ యంబునుబొందఁ
డె వేంకటేశ్వరా॥ 13

ఉ॥ ఎంతబలాఢ్యుఁడైన వడి ♦ నెంతటికోపము తోడవచ్చినన్।
నంతయుఁజేయఁడొప్పమిని ♦ సూటిగమ్రొక్కినవానికెప్పు
డున్। ఎంతయుఁ బొర్లి వచ్చు నది ♦ యించుకవంగిన తుంగ
గడ్డికా। వంతయుఁ గీడొనర్పక యె ♦ యట్టెతొలంగదె వేం
కటేశ్వరా॥ 14

చ॥ కడఁగుచు ద్యూతమాడఁ జనఁ ♦ గావలదెవ్వరికైన నాడి
నన్। దడయక యే నశించుఁ దమ ♦ ద్రవ్యచయంబులు ని
శ్చయంబుగాఁ। దొడరియుధర్ముఁడా శకుని ♦ తోడనుధర్మ
జుఁడాడిజూదమున్। గడకుస్వరాజ్యమున్విడచి ♦ కానలకే
గఁడె వేంకటేశ్వరా॥ 15

చ॥ కడుబలశాలినంచునతి ♦ గర్వము నొందుచునల్పమానవున్।
దుడుకునఁ జంపఁగాఁజనదు ♦ తోడగునాతఁడె దొడ్డవానికి
న్। వడిగనువచ్చి చిట్టెలుక ♦ పాశమునంబడు సింహరాజ
మున్। విడువఁగఁ జేయు లేదె కడు ♦ వేడుకతోడను వేంక
టేశ్వరా॥ 16

వేంకటేశ్వరశతకము.

చ॥ బలమునఁ గానికార్యమును • పాయముచేతను జేయఁగావ
చ్చున్ । వలసినశక్తిలేమినొక • వాయసమూగ్రహమూనిపు
ట్టలో । పలమణిహారమొందిడును • పాయముచేఁ దవగ్రు
ద్ధమున్గుతుం । దలినివధింపఁ జేయదెపి • నాశమునొందఁ
గ వేంకటేశ్వరా॥ 17

చ॥ అంతయకయెన్నఁడైనఁబర • మార్థముగాఁ బనిదేవినై వఁదాం।
దరపడిచేసినన్మ్రుగుల • నాశనమొఁదుట నిక్కమేసుమీ ।
యురణయుగంబుడీకొనుచు • నుఁడఁగ మధ్యనుబడ్డయా
మిషా । త్కరమునుగోరిజంబుకము • ధారుణిఁగూలదె వేం
కటేశ్వరా॥ 18

చ॥ అనిశముఁగీడుచేయునరుఁ • డల్పుఁడెమైవను నేస్తుతోడ
వా । నిని వడివీడకున్నయెడ • నిగ్రహకష్టములబ్బుఁ బ్రాణి
కిం । దన యరికాలిలోపలను • నాటినముల్లొక యించుకై
నఁదాఁ । జ . పడితీయకున్నయెడ • బాధనుబెట్టదె వేంకటే
శ్వరా॥ 19

ఉ॥ వారకదైవభక్తులను • బాధలఁబెట్టుదురాత్మునత్యహం । కా
రముతోడ దైవతము • గ్రక్కునఁగూలిచిపోచు భక్తులన్ ।
వారణరాజ మున్మ్రుగుల • బాధలఁబెట్టెడు నక్రరాజును । వ్యా
రిగఁదుంచిశౌరితన • భక్తునిబ్రోవఁడె వేంకటేశ్వరా॥ 20

చ॥ జడమతియైనశిష్యునకు • శ్రద్ధవహించుచుఁ జెప్పువిద్యయొ ।
న్నఁడును మనంబులోపలను • నాటదు జ్ఞానములేకపోవు

టన్ । బుధములఁ దక్కువౌ చవిటి ♦ భూమినివిత్తులు చల్లి
యుండిన। స్వడిగ నడంగుఁగాని మఱి ♦ నాటున చెప్పుమ వేం
కటేశ్వరా॥ 21

ఉ॥ చాలఁగ దేనినోమిషను ♦ సజ్జనుమీఁదను బన్నుచుండి దు।
శ్శీలతదుష్టుఁడాతనికిఁ ♦ జేటొనగూర్చుటనిక్కువంబు శా।
ర్దూలముగడ్డలోపలను ♦ దోయముఁద్రాగెనిఁ గొత్తెపిల్లపైఁ।
బోలనినింద మోపి పౌరి ♦ పుచ్చి భుజింపదె వేంకటేశ్వరా॥ 22

ఉ॥ జ్ఞానముగల్గి విద్యలను ♦ గాంతు ననేర్చెడిశిష్యునందు స।
మ్మానముగల్గియుండును సు ♦ మాగురుసత్తముఁ డన్ని వే
ళలన్ । మానముగాను ఫల్గుణుఁడ ♦ మానమనీమనువిద్యనే
ర్చుటన్। ద్రోణుఁడు సూపఁడేదయఁగు ♦ తూహల మొందు
చు వేంకటేశ్వరా॥ 23

ఉ॥ ఆదరమొప్పఁ గేశవుహ్మా ♦ దంబుజమందిడు భక్తవర్యునిన్।
వేదవలెన్ని పెట్టినను ♦ వీడునె యాతఁడు విష్ణుచింతనౌ।
మోదముతోడఁ గేశవుని ♦ ముఖ్యముగాను భజింపుచుం
డు ప్రి। హ్లాదువధింపఁ బూనినతఁ ♦ డచ్యుతుఁగొల్వఁడె
వేంకటేశ్వరా॥ 24

చ॥ పొగడితనొందు వంశమునఁ ♦ బుట్టినవానికిఁ గొన్నిరోని
యున్ । సుగుణములుండు నిక్కముగ ♦ శుద్రగుణంబుల
వెన్ని యుండినన్। నగడుచునుండు వ్యాఘ్రికి జ ♦ నించినపి
ల్లను నిశ్చయంబుగాఁ। దగినది చారయొక్కటియు ♦ దానికి
నుండదె వేంకటేశ్వరా॥ 25

చ॥ ఖలునకు సజ్జనుండు కడు ♦ గౌరవమొప్పఁగ బుద్ధులెన్ని
యో। పలుమరు చెప్పియుండినను ♦ బాయునె యాతఁడు దు
ర్గుణంబులన్। వలనుగఁ గండ చక్కెరను ♦ వార్నిధిలోఁ బలఁ
జాల వెచ్చగాఁ। కలిపిన సాగరుండు తన ♦ క్షారము వీడునె
వేంకటేశ్వరా॥ 26

చ॥ కులమున నొక్కరుండు సమ ♦ కూడిన నిక్కలి జ్ఞానవంతుఁ
డా। కులము ప్రసిద్ధి నింగనున ♦ కుంఠిత తేజముతోడ నింటి
లో। పల నొక దీపమున్న యెడ ♦ బాగుగ నాభవనంబదంత
యున్। కలితశుభాకృతిం గడు ప్ర ♦ కాశము నొందదె వేం
కటేశ్వరా॥ 27

ఉ॥ సేవకుఁ డెప్పుడున్ బ్రభుఁడు ♦ చెప్పిన కార్యములన్ని వేడు
కన్। గావరమంత యున్విడిచి ♦ క్రౌర్యము లేక యొనర్పఁగా
నగున్। భావమునందు భక్తి విడి ♦ పంతమెలర్పఁగ సంత
సంబునన్। బావని రామకార్యములఁ ♦ బట్టుగఁ జేయఁడె వేం
కటేశ్వరా॥ 28

చ॥ వరుసగ ధీరపుంగవుఁడు ♦ బాధలు పెక్కులు పొందుచుండి
నన్। శరణను జొచ్చువారలను ♦ సమ్మతిఁ బ్రోచుచునుండు స
త్కృపన్। సురపతిపుత్రుఁడౌ నరుఁడు ♦ శూరత యొప్పఁ
గఁబోఁ కృష్ణుతో। శరణను జొచ్చు నాగయుని ♦ జయ్యన బ్రో
వఁడె వేంకటేశ్వరా॥ 29

చ॥ సుజనులు తమ్ముఁ గష్టములు ♦ చుట్టఁగ ఖేదము పొందుచుం
డినన్। నిజముగ దీనపక్షులకు ♦ నేర్పున సౌఖ్యములిచ్చు

చుంద్రిభూ । మిజములు సూర్యతేజమున ♦ మెండగుబాధ
నుబొందుచుండినన్ । నిజముగ బాటసారులకు ♦ నీడలనీ
యవె వేంకటేశ్వరా। 30

చ। విడువక శాస్త్రపాఠములు ♦ పేర్మి నిన్నేర్చినవాని నోటిలో ।ను
డుగక చాలఁగాను సమ ♦ యోచిత వాక్యములూరు నెప్పు
డున్ । ఎడపక పాఱుచుండు సెల ♦ యేటను బాగుగఁ దీయు చె
ల్మలో। నెడ తెగకుండ నీటి జల ♦ లేవుగ నూరవె వేంకటే
శ్వరా। 31

ఉ। ఎంచక పాపసంఘమున ♦ కించుక యేని యానందు నిచ్చినన్
సంచితపూర్వపుణ్యముల ♦ సంతతులన్ని నశించుఁ బూర్తిగాఁ।
గొంచెము రంధ్రమున్న యెడఁ ♦ గుంభములోపలినీరు మె
ల్లగాఁ। నించుకయైన నుండకయె యేగుటచూడవె వేంక
టేశ్వరా। 32

ఉ। భామిని యెన్నిమాయలను ♦ బన్నిన వానికిఁ జిక్కకుండ
నే। నేమము చేతనైనఁ గడు ♦ నేర్పునదానిని వీడఁగావగున్।
గామిని యాపరాధి నియ ♦ గాధపుమాయల వెన్నొ వన్నఁ
ధా । నే మియునాకయాత్రివరుఁ ♦ డేగుట చూడవె వేం
కటేశ్వరా। 33

ఉ। సారయుతప్రశూరుఁడని ♦ శంఖును శత్రువు చేయునా విర।
స్కార మొకించుకేనియును ♦ సైరకమందుచునుండుఁ గోపి

వై। వారిజమిత్రదృష్టి పరి♦వారమువీఁదను సోకినం
తనే। వారకసూర్యకాంత శిల♦పైకొని మండదె వేంకటే
శ్వరా॥ 34

ఉ॥ విద్యనునేర్వకుండినను♦వేషయుతుం గొనియాడుచుండి స
ద్విద్యను నేర్చియున్న నపి♦వేకియటందురు వేషహీనునిన్।
హృద్యముగాను లేరనుచు♦నెందఱొ భాగ్యులవీడి బైట
కున్। హృద్యులవేశ్యలం గలిసి♦హీనతనొందరె వేంకటే
శ్వరా॥ 35

చ॥ ఉరుగతి దుర్జనుండు కడు♦నుద్ధతితోడను వచ్చుచున్నఁ
దా। నడఁగును మార్గమధ్యమున♦నాత్మసముద్ధతి వీడియె
వ్వతున్। గడువడి నబ్ధిలోనితర♦గల్మినుముట్టఁగ వచ్చి
మార్గమున్। దడఁగవె యుద్ధతిన్విడిచి♦యాక్షణమందు నె
వేకటేశ్వరా॥ 36

చ॥ అనయము పుణ్యకార్యముల♦నాదరమొప్పఁగ శ్రద్ధతో
డఁ జే। సినయెడఁ బాపసంఘములు♦శీఘ్రముగా మటుమా
యమౌను గు। ర్వనిలము వీచినట్లుయున♦నంబుదసంతతు ల
న్నికంటికిన్। గనఁబడకుండ దూరముగ♦గ్రక్కునఁ బోవ
వె వేంకటేశ్వరా॥ 37

చ॥ కలతను బొందియుండినను♦జ్ఞానమునంతటి వీడియుండి
నన్। మలినములేక స్వచ్ఛముగ♦మారును జిత్తమువుం
చివాక్కులన్। కలుషమునొందియుండు నుద♦కంబలయుండు

గు బంకచేత ని। ర్మలముగ నుండ లేదె యతి ♦ మాన్యచరి
తుండ వేంకటేశ్వరా॥ 38

చ॥ అతిబలశాలియైనఁ దన♦యుండను దోడు నరుండు లేనిచో। న
తులితకార్యసంచయము ♦ లన్నియుఁ గావుమటన్న చెప్పి
నన్ । బతగము వీర్యముండినను ♦ బక్షయుగంబును వీడి
యున్న నే। గతి వినువీధియందెగురఁ ♦ గల్గును జెప్పుము వేం
కటేశ్వరా॥ 39

ఉ॥ ఆతత పుణ్యకార్యముల ♦ నాదృతి నెవ్వరు చేయుచుందు
రో। పాతక సంఘమెప్పుడును ♦ వారలనంటదు భీతియా
టచే। భాతిగ నెప్పుడున్ మృగుల ♦ బైకొని మండెడు నగ్ని దేవు
నిన్ । భీతియొకింత లేక చెద ♦ వేదుకఁబట్టును వేంకటే
శ్వరా॥ 40

ఉ॥ భూతలమందు జాఱిపడి ♦ పోయిన సజ్జనుఁ డాస్థలంబునన్ ।
భీతినడంగకుండ నతి ♦ వేగముతోడను బైకిలేచు ను। ర్వీ
తలమందు జాఱఁగను ♦ వేసినకందుక మాత్రణంబునన్ ।
స్ఫాతిశయంబునం గదుర♦యంబున లేవదె వేంకటేశ్వరా॥ 41

చ॥ పెనిమిటు లెందునున్నను వి ♦ వేకము మీర నదెట్టులైనఁ
ద। ద్వనితలు భక్తితోడఁ దము ♦ భర్తల సన్నిధి కేగఁగా న
గున్। వననిధి చాల దూరమున ♦ వర్తిలుచుండిన నెట్టులైన
వా। హినులు సముద్రసన్నిధికి ♦ నేగుట చూడవె వేంక
టేశ్వరా॥ 43

చ॥ అనవరతంబు మర్త్యుఁ డధి ♦ కాశను బొందుచు నున్నదా నితోఁ। దనియక యుండినట్లయినఁ ♦ దప్పక యున్నది పో వునేటి వం। తెనఁబడిపోవు కుక్క తన ♦ నీడనుజూచి భ్రి మింపనేట నో। టనునిడికొన్న మాంసము త ♦ టాలునజాఱ దె వేంకటేశ్వరా॥ 43

చ॥ అరయక దుష్టమానవుల ♦ కాదర మొప్పఁగఁ దావునిచ్చు న। ప్పురుషుని మాటిమాటికిని ♦ మోదుచునుందురు లోకులె ల్లరున్। ఇరవును మత్కుణంబులకు ♦ నెంచక యిచ్చినయ ట్టిమంచమున్। బురపురఁబొక్క మానవులు ♦ మోదక యుం దురె వేంకటేశ్వరా॥ 44

ఉ॥ కూ్రరతసజ్జనుం జెఱుపఁ ♦ గోరెడు కూ్రరుఁడు దారుణంబు గాఁ। బోరొనగూడి తానె చెడి ♦ పోవును దైవము లేమినా పెసన్। ఊరక పాండుపుత్త్రులను ♦ యోధనుఁడట్టులఁ జేయ నెంచి దు। ద్వారరణంబు లోపలను ♦ వాఁడిలఁగూలఁడె వేం కటేశ్వరా॥ 45

ఉ॥ మిక్కిలి ఖిన్నుఁడౌ నరుఁడు ♦ మిత్త్రుఁడు వచ్చిన వానిఁజూ చి తా। గ్రక్కున సంతసించుఁ గద ♦ కాంతివహించుచువం తకంతకున్। నిక్కము చూచె యట్లగుట ♦ నీరజమిత్త్రుని జూ డఁగాన తా। గ్రక్కునఁ బంకజంబతి వి ♦ కాసము నొందదె వేంకటేశ్వరా॥ 46

చ॥ విరతముతండ్రియున్ గురుఁడు ♦ నేమ్పనఁ జెప్పెడి కార్య ముల్ సమా। దరమునఁ జేయఁగావలయుఁ ♦ దత్సుతశిష్యు

లు తప్పకుండ దా।శరధియుఁ గృష్ణుఁడున్కి గుల♦సంతపమొం
దుచు వారికార్యముల్। పరగునఁ జేసియిర్వురును ♦ స స్తు
తినొందరె వేంకటేశ్వరా॥ 47

ఉ॥ మానము గల్గువార లభి ♦ మానముతోడను గార్య సంఘ
ముల్ । పూనినపట్టువీడకయె ♦ పూర్తి గఁజేయుచు నుందు
రెప్పుడున్ । మానక దేవదానవులు ♦ మంథగి పర్వత మంబు
రాశిలో । నూనికతో మథింపరె యు ♦ నూనబలంబున వేం
కటేశ్వరా॥ 48

చ॥ సతత మొకించు కేనియును ♦ సద్గురుశిక్షను బొందకుండినన్।
వితతగుణాఢ్యుఁడైన నుపి♦ వేకముగల్గి ప్రకాశమొందఁడా।
తతమతి శిష్యుఁడెంతయును ♦ దథ్యమునుమ్మ మదీయవా
క్యముల్ । రతనము సానపట్టకయె ♦ రంజిలనేర్చునె వేంక
టేశ్వరా॥ 49

చ॥ పురుషుఁడు శత్రువీరుల స ♦ మూలముగా వడిఁజంపకున్న
నే । సరణిని నైన నారివులు ♦ చాలఁగ బాధలఁ బెట్టుచుందు
రా। యురులగు రాహు కేతువుల ♦ హంకృతితోడను సూర్య
చంద్రులన్ । దరుణముచూచి బాధలను ♦ దార్కొని పెట్ట
రె వేంకటేశ్వరా॥ 50

చ॥ వినుతకులంబునందుఁ బ్రభ ♦ వించు నరోత్తముఁ డించుకే
నియుం। దినుటకు లేకపోయినను ♦ నీచపుటన్నము మెక్కఁ
డెప్పుడున్ । అసితము తిండిలేక కడు ♦ నాకటసోలుచును

న్న జీర్ణమా । తృణమును మేయఁ బాల్పడునె ♦ దీనతఁ గేస
ఱి వేంకటేశ్వరా॥ 51

ఉ॥ చానలకెప్పుడుం జనవు ♦ చాలఁగ నీయఁగఁ గూడ దిచ్చినన్ ।
జ్ఞానము లేని వారలయి ♦ కాంతుల వంచెదరల్ప బుద్ధిచే ।
హీనపుబుద్ధిచే దశర ♦ థేశుఁడు కైకకు స్నేహ మియ్యనా।
మానిసి యాతని న్వెతల ♦ మధ్యను ద్రోయడె వేంకటే
శ్వరా॥ 52

చ॥ మనమున నన్యవీర్యపరి ♦ మాణము నెంచక పొంగిబాడున ।
మ్మనుజుని గర్వ మొందఁ డొకడు ♦ మాయఁగఁ జేయుచునుం
డు గంధమాదనమున కేగుచుం బధిని ♦ దర్పములాడెడు భీ
ము గర్వభంజన మొనరింపఁడే హనుమ ♦ సంతసమొందుచు
వేంకటేశ్వరా॥ 53

ఉ॥ కూరిమితోడ ఘాతకుఁడు ♦ క్షుద్రుని సంస్తుతి చేయుఁగాని స।
త్పూరుషు మెచ్చఁ డెన్నఁడును ♦ మోదముతోడను బంక
యుక్తపూ। వారిని మున్నిదానినభి♦ వర్ణనముం బొనరించుప ది
ప । న్నీరము నెప్పుడుం బొగడ ♦ నేర్చునె చెప్పుము వేంక
టేశ్వరా॥ 54

ఉ॥ క్రూరునకెన్ని ధర్మములు ♦ కూరిమిఁ జెప్పిన నాతడెప్పు
డుఃఖ । దారుణకోపయుక్తుఁడయి ♦ ద్రోహము వీడక యుంట
తథ్యమా। క్షీరము లిచ్చి పెంచినను ♦ సీత్కృతి నెప్పుడుఁ జూపు
చుండు నా। క్రూరసరీసృపంబు తన ♦ క్రూరతమానునె వేం
కటేశ్వరా॥ 55

ఉ॥ కాంతుని వీడియుండినను ♦ గానసీమల బాధలొందిన న్।
స్వాంతమునందు భార్యతన ♦ స్వామినిగొల్చిన ఖ్యాతిగాం
చు ద్వీ। పాంతరమందు నున్నను మ ♦ హాటవినున్ననుగొ
ల్చిరామునిం। గాంతలమిన్న సీతకదు ♦ ఖ్యాతిని గాంచదె
వేంకటేశ్వరా॥ 56

చ॥ పరమగుమాధురిం గులుకు ♦ పల్కులచేతను మూర్ఖచిత్త
మే। తరుణమునందునైన విది ♦ తంబుగరంజిలజేయఁ గష్ట
మా। సరసిజనాళతంతువుల ♦ సంతతిచేతను గట్టవచ్చు
నా। ద్విరదము నెన్నఁడైన నతి ♦ భీతిని బొందక వేంకటే
శ్వరా॥ 57

ఉ॥ ఈతఁడె గొప్పదాతయని ♦ యెవ్వరు నెచ్చటఁజెప్పకుండఁ
బ్రఖ్యాతగుణౌఘకీర్తులు న ♦ ద్యాగగుణంబును జాటునం
తటన్। ఆతతమల్లికాకుసుమ ♦ మందఱకిచ్చట నున్నదం
చు స।ద్వ్యాతవిదూరదేశగత ♦ వాసనదెల్పదె వెంకటేశ్వరా॥

ఉ॥ శూరుఁడనంచు ముందుగను ♦ శూరతబింకములాడి విద్వి
ష। ద్వారముఁ గాంచి వెన్కకును ♦ బాఱినవానికి నవ్వుబా
టులౌ। క్రూరులఁ గారవాధములఁ ♦ గూల్చెదనంచును బ
ల్కిపిమ్మటన్। వారలగాంచి యుత్తరుఁడు ♦ పాఱఁడె భీతి
ని వేంకటేశ్వరా॥ 59

చ॥ సతతము నీతియుక్తుఁడయి ♦ సత్యముపల్కెడు మర్త్యపుం
గవున్। వితతబహూకృతిం జనులు ♦ వేడ్కధరింతురు శీర్ష

మందు నా । తతసుతసౌరభంబును సు ♦ దారమ్మృదుత్వము
నొందుపువ్వు సంతతి జనులుత్తమాంగమునఁ ♦ దాల్పక
యుందురె వేంకటేశ్వరా॥ 60

చ॥ గురుతరసజ్జనావళిని ♦ గ్రూరుఁడు బాధలఁ బెట్టుచుండ హా।
చ్చరికను జేసి వేఁడికొనుఁడు ♦ సాయము చేయును నిష్ఫలంబు
గన్ । వరుసగనుండు గేహములఁ ♦ బావకుఁడెంతయుఁ గా
ల్చుచుండఁ జూ । తుదిమొఱయుం బ్రిభంజనుఁడు ♦ తోడ్పడ
కుండునె వేంకటేశ్వరా॥ 61

చ॥ దురితహరద్విజాయకు చ ♦ తుర్థిదినంబున నెంచకుండఁజూ।
దుకుఁగనుఁబట్టి పూరుషుఁడు ♦ నూనముగా నపనిందఁబొందుఁ
దా। నరయుకచిన్నికృష్ణుఁడు సు ♦ ధాంశుని క్షీరమునందుఁ
జూచి యా । తరుణమునందెనిందలను ♦ దప్పకపొందఁడె
వేంకటేశ్వరా॥ 62

చ॥ కులమును జెప్పకుండఁ దనకోర్కెలభింపఁగ దాచియుంచి
నన్ । నిలకడమీఁదనే తెలియు ♦ నిక్కముగాఁ గలరూప
దంత వి। ద్యలఁగొనఁ గర్ణుఁ డన్వయము ♦ నాభృగుపుత్రు
ని చెంతదాచినం । దెలియఁగ లేదె యాతనికి♦ నిక్కపు
మార్గము వేంకటేశ్వరా॥ 63

చ॥ అనవరతంబు బీదలగు ♦ నట్టిమనుష్యులు ద్రవ్యకాంక్షచే ।
ధనముగలాని చెంతకును ♦ దప్పక చేరెద రన్నివేళలన్ । ఘ

నరసకాంత్రతోడుతను ♦ గప్పలు తెప్పలుగాను గూడియే ।
యనువునవైనఁ జేరవె జ♦లాశయ మున్వడి వేంకటేశ్వరా॥

చ॥ వినుతినిగాంచు పండితులు ♦ వేరనిగన్గొన బుద్ధిపుట్టినన్ । ఘ
నసభలోఁ బరీక్షలను ♦ గాంక్షను జేసినఁ దేట తెల్లమౌఁ! గ
నకపు మంచిచెడ్డలను ♦ గన్గొననెంచిన గీటురాతిమీఁదను
నొకగీటు గీచినను ♦ దప్పక తేలవె వేంకటేశ్వరా॥ 65

చ॥ పలుమరుశాస్త్రముల్ చదివి ♦ బాగుగఘుష్ట ముచేయకుండి
నన్ । ఖలితముతోనుగాని మదిఁ ♦ జక్కఁగనాటవుబాట
లో పలం । బలువురుమానవుల్ పడియు ♦ మారులు పోవ
కయున్న బాగుగా । నలుగునె తోవయెన్నఁడయి ♦ నన్గు
ణాసన్నుత వేంకటేశ్వరా॥ 66

చ॥ పడసి సమస్త విద్యలను ♦ బండితుఁడైనను గార్యముండి
నన్ । విడుచుట మంచిమార్గమతి ♦ వేగముతోడనుదత్క
పండితుం । బెడఁగగు మానికంబుతల ♦ మీఁదనురంజిలు
చున్నఁ గుండలిన్ । జడియక యెవ్వరైనఁదమ ♦ సన్నిధి
నుంతురె వేంకటేశ్వరా॥ 67

ఉ॥ కూరినకెప్పుడుంజనవు ♦ కూరిమినెక్కువ యిచ్చియున్న
న । వ్వారిగవానివల్లఁబలు♦ బాధలు పొందుదురెల్ల మాన
వుల్ । కారముగల్గుసున్న మది♦కంబుగఁ దమ్మలమందురా
చినన్ । నోరులు పొక్కకుండునె మ ♦ నుష్యులకెల్లను వేం
కటేశ్వరా॥ 68

చ॥ కలిత కుతూహలంబునను ♦ గాఁ ప్రవహించుచుఁ గోరకుండ
దా । తలువెనుముందుచూడకయె ♦ ద్రవ్యము నిచ్చెదరర్థి
కోటికిన్ । జలధరసంతతుల్మనకు ♦ సస్యపుఁబంక్తికిఁ గోర
కుండఁగన్ । సలిలమునీయలేదె కదు ♦ సంతసమొందఁగ వేం
కటేశ్వరా॥ 69

ఉ॥ మానకదుష్టకార్యముల ♦ మర్త్యుఁడు చేయఁగ వచ్చునింద,
త । న్మానముఁ దూల్చియయ్యది క్ష ♦ మాస్థలినుండును సుస్థి
రంబుగాఁ । బూనికతోడ రుద్దినను ♦ బుట్టమునంబడు చీకి
ముచ్చ తాఁ । గానఁగవచ్చుఁగాని మఱి ♦ గన్పడకుండున వేం
కటేశ్వరా॥ 70

చ॥ పతులు దరిద్రులైయుచిత ♦ వస్త్రముఁగట్టఁగలేక యుండినన్ ।
సతులు స్వభర్తలం గలిసి ♦ సమ్మతినుండినఁ గల్గుసద్గతుల్ ।
పతియు దరిద్రుఁడౌనలుఁడు ♦ వస్త్రము గట్టఁగలేక యున్నఁ ।
ద । త్సతిదమయంతి వానిదరి ♦ సమ్మతినుండదె వేంకటేశ్వరా॥

ఉ॥ ఎంతధనాఢ్యుఁడైనఁ దగ ♦ నింతుల నిర్వురఁ బెండ్లియాడి
నన్ । బంతముతోఁ బరస్పరము ♦ వారలుపోరుదు రింటిలో
పలన్ । సంతతభూతియౌ శివుఁడు ♦ చండికగంగను బెండ్లి
యాడనా । యింతులు దుష్టవాక్యముల ♦ నెంతయుఁ బోరరె
వేంకటేశ్వరా॥ 72

చ॥ ఇతరుల మానసంబులకు ♦ హింసయొనర్పక యుంచుకేని
యున్ । సతతము స్వీయకార్యములఁ ♦ జక్కఁగఁ జేసికొనంగ

యుక్త్రమా। అతిమృదుపుష్పసంతతికి • హానియొనర్చక త
న్మరందమున్। గుతుకముతో మిళిందములు। గ్రోలుచునుం
డవె వేంకటేశ్వరా। 73

ఉ। పండితవేషమొక్కరుఁడు • బాగుగ వేయఁగవచ్చు సత్సభా।
మండలమందుఁ బండితుల • మధ్యను బల్కఁగఁ జాలకష్టమా।
నిండుగ సింహరూపమును • నేర్పునఁ దాల్చెడి గ్రామసింహ
ము। ద్దండ గభీర రావమును • ధాటిగఁ జేయునె వేంకటేశ్వరా।

చ। వలనుగ నొక్కరుండు సభఁ • బండిత వేషము వేసియేమియున్।
బలుకక యుండినట్లయినఁ • బండితుఁ డందురు మర్త్యులాత
నిన్। ఎలమి రసాలపాదపము • నెక్కెడి కాకము కూయకు
న్న లో। కలుగని మెంచరామదిని • గోకిలయంచును వేం
కటేశ్వరా। 75.

చ। మనమున నెంచకుండ నొక • మర్త్యుఁడు జారులవీధి కేగనా।
మనుజుని జారుఁడందురు సు • మా జనులందఱుఁ దాటిచెట్టు
క్రిం। దనొకఁడు పాలుత్రాగినను • దప్పక కల్లునుద్రాగెనం
చుమా। తనిపయినింద మోపరె ము • దంబున లోకులు వేంక
టేశ్వరా। 76.

చ। బిరబిర లేచి యొక్కరుఁడు • భీతియొకింతయు లేక సన్న్యసీ।
శ్వరులతపంబులం జెఱుప • సాగిన నప్పుడె నాశమొందునీ।
శ్వరునితపోవిధానమును • సాహసవృత్తిని బాడుచేయునా!
స్మరుఁడు వినాశమచ్చటను • జయ్యనఁ బొందఁడె వేంకటే
శ్వరా। 77

చ॥ సమముగ మర్త్యపుంగవుఁడు ♦ శ్రద్ధవహించుచు సర్వశబ్ద
శా। స్త్రముతగనేర్చియున్న యెడఁ ♦ దప్పులునొప్పులుఁగా
నవచ్చు దీ। పముఖ వనంబునన్నిగుల ♦ బాగుగ వెల్గుచును
న్నఁగంటికిన్। క్రమముగ నన్నివస్తువులుఁ ♦ గన్పడకుండు
నె వేంకటేశ్వరా॥ 78

చ॥ నిరతము భక్తితోడుతను ♦ నీచుఁడు సజ్జనుఁగూడియున్న
ను। స్థిరగుణసంచయంబులు ను ♦ శీలత యబ్బునువానికె
ప్పుడున్। బరిమళయుక్తపుష్పమును ♦ బాయకయెప్పుడు
నుండునారకున్। వరద, తదీయదివ్యతమ ♦ వాసనయబ్బ
దె। వేంకటేశ్వరా॥ 79

చ॥ పరమగుఁణట్టి ప్రజ్ఞగల ♦ పండితతల్లజుఁడైన రాజు సా। దర
మునఁ జూడకున్న యెడఁ ♦ దానుబ్రకాశమునొందఁ డెన్నఁ
డున్। సురుచిరరత్నరాజమల ♦ సూర్యుని తేజము సోకకు
న్న నే। కరణిని బ్రజ్వరిల్లుగురు ♦ కాంతివహించుదు వేంక
టేశ్వరా॥ 80

చ॥ తెలివిగలాని మానసము ♦ తీరున వేడ్కగురుండు చెప్ప
వి। ద్యల నవివేకిమానసము ♦ సాదరమొప్ప గ్రహింపలే
దు ని। ర్మలమగు మానికంబువలె♦మాన్యముగాఁ బ్రతిబిం
బ సంహతిన్। మెలకువతోడఁ జేకొనునె♦మృత్తికపిండము
వేంకటేశ్వరా॥ 81

చ॥ తరుణవయస్కులంచు సత ♦ తప్రథితోల్బణ వేషలన్ సు
వో। హారలను వేశ్యలంగలియు ♦ నన్నరుఁడాపదలొందునె

ఫ్పుడున్ । వరరుచిఁ గల్గు నా ముసిఁడి ♦ పండును వేడుకతో
భుజించినన్। బురుషుఁడు తద్విషంబునను ♦ మోసము నొం
దఁడె వేంకటేశ్వరా॥ 82

చ॥ అనిశము పండితోత్తముని ♦ యండను జేరి నివసించుచున్న నా।
తని ఘనపాండితిం జడుఁడు ♦ తథ్యముగాఁ గొనజాలఁడెప్పుడు।
న్వనజము చెంత దర్దురము ♦ నారతముండిన నైనఁ దత్సువా।
సనను గ్రహింపవానికిని ♦ సాధ్యమె యెన్నఁడు వేంకటే
శ్వరా॥ 83

ఉ॥ జాయలు భక్తితోడఁ గడు ♦ సంతస మొందుచునుండి భర్త
లన్ । బాయక నిత్యమున్న యెడ ♦ వారలు గాంతురు ఖ్యాతి
చాలఁగా । ఛాయయు భాస్కరున్ విమఁ ♦ చంద్రిక పూర్ణసు।
ధాంశు నిత్యమున్ । స్వాయత కీర్తి నొందనెడ ♦ బాయక యుం
డవె వేంకటేశ్వరా॥ 84

చ॥ ధనమును గోరు యాచకులు ♦ ద్రవ్యము గల్గిన వారి రాకకై
యనవరతంబుఁ దాము పర ♦ మాదృతిఁ జూతురు నిశ్చయం
బుగా । వనధర వారిధారలను ♦ వారక కోరెడు చాతకాళి
తా । ననయము మబ్బు రాకలకు ♦ నాదృతిఁ జూడదె వేంకటే
శ్వరా॥ 85

చ॥ ఉపకృతి జేయనెంచు నరుఁ ♦ డోపికతోడను సంచరించి యే।
నెపమున నైనఁ జేయుఁగద ♦ నేరుపు మీరఁ బరోపకారమున్।
దపనుఁడు సంచరించి సత ♦ తంబును ప్రాణులకెల్లఁ బూర్తి

గా । నుపస్మృతిఁజేయుచుండఁడె యు♦నూనముదంబున వేంక
టేశ్వరా। 86

ఉ। ఆకలిఁగొన్నవారలకు ♦ నన్నముపెట్టఁగలేక పూర్తిగా।నా
కలిలేనిమానవుల ♦ కయ్యది పెట్టినసేమిలాభమా ! చేకొని
వాడియున్నవరి ♦ చేలకువర్షమునీయకుండ ర। త్నాకర
మందునింప జల ♦ దాళికిలాభమె వేంకటేశ్వరా। 87

ఉ। శూరునిమైత్రి ముందుగను♦గొప్పగఁ గన్పడుచుండి పిమ్మ
టన్ । సారెకు నారెకున్నిగుల ♦ చాలఁగఁ దగ్గును నిక్క
వంబుగా। భూరితరంబుగా మొదటఁ ♦ బొద్దుటఁగన్పడు నీ
డలన్ని వి। స్తారము పిపిపాట్రిగను ♦ దగ్గక యుండునె వేంక
టేశ్వరా। 88

ఉ। తమ్మునితోడ వైరమమి ♦ తంబుగఁబూనిన నాతఁడట్టెరో ।
పమ్ముగ నన్నగుట్టతని ♦ శతృలతోడను జెప్పుచుండుఁ జం ।
తమ్ముగ రావణుండు తన ♦ తమ్మునితోఁగలహింపవాఁడు
కోరి। ధమ్మున గుట్టురామునకుఁ ♦ దప్పక తెల్పఁడె వేంకటే
శ్వరా। 89

ఉ। శూరునవెన్ని దౌష్ట్యములు ♦ గూడిననాచెడు వర్తనంబు
లన్। ధారుణినాథుఁడెప్పుడును ♦ దప్పక తీర్చుచు నుంటత
థ్యమా । దారువు నెన్నివంకరలు♦దాల్చిని యున్ననువా
నినన్నిటిన్ । దీరుగఁ బొయ్యమందుచును ♦ దీర్పక యుండు
నె వేంకటేశ్వరా। 90

ఉ॥ దాతధనంబు నర్థులకు ♦ దానముచేసి దరిద్రుఁడైన నా। దా
తయె యంతకంతకు ను♦దారతవన్నెను గాంచునెప్పుడున్।
రాతను సానపట్టఁగను ♦ రత్నముచాలఁగఁ దగ్గిపోయినన్।
ఖ్యాతినిగాంచలేదె యతి♦కాంతివహించును వేంకటేశ్వరా॥

చ॥ అతిశయమూని మానవుఁడ ♦ హంకృతి తోడను బైకి లేవఁ
గా। నతనిమదంబు వేఱొకడ ♦ హంకృతితోడ నడంచువిం
ధ్య ప। ర్వతము మహోద్ధతిం బెఱిగి ♦ భాస్కరచంద్రు
ల కడ్డువచ్చు సం। గతిఁగని దానిగర్వము న ♦ గస్త్యుఁడడం
పఁడె వేంకటేశ్వరా॥ 92

చ॥ ఉరుతరభాగ్యరాశి తన ♦ కున్నదియంచును గర్వమొందు
చున్। బరులఁబరాభవింప నవ ♦ మానముఁగల్గకయున్నె వా
నికిన్। సికలదొలంగి ద్వైతవనిఁ ♦ జేరినపార్థులఁ గేళిచేయఁ
గా। నరిగిపరాభవంబిభపు ♦ రాధిపుఁడొందఁడె వేంకటే॥ 93

చ॥ ధనమును జాలలోభమున ♦ దానముచేయక తాముసైత
మున్। దినకయె కూడఁబెట్టినను ♦ దీసిహరింతురు చోరులె
ప్పుడో। పనివడిచాలఁగాను మధు ♦ పంబులు తేనెను గూ
డఁబెట్టినన్। మునునరులేగి దాసిగొని ♦ పోవకయుందురె
వేంకటేశ్వరా॥ 94

చ॥ కడిమిని దుర్జనుండు తన ♦ కార్యముఁ దానెగవేగ్రుకొంట
కై। యడఁగి యనంతరంబు దుర ♦ హంకృతితోడను తే
చుమీఁదికిన్। బడయఁగఁగోరి తోయమును ♦ వంగినయేత

మహంతరంబు తా। నడఁకువవీడి మీఁదికిన ♦ నాదృతిలేవదె
వేంకటేశ్వరా॥ 95

చ॥ వారిజనేత్రి సచ్చరణ ♦ పంకజసంతత సేవచేత సం। సారము
భక్తులెల్లరును ♦ జయ్యనదాటుచు నుందురెప్పుడున్। దారు
ణభంగ నక్రభయ ♦ దంబగు వార్థిని నావనెక్కి యు। వ్వా
రిగ దాటకుండుదురె ♦ పంచజనుల్వడి వేంకటేశ్వరా॥ 96

ఉ॥ పోరిదివహించు దుర్జనుని ♦ ముందఱబుద్ధుల వెన్ని చెప్పినన్।
గాదనుఁగాని యాతనికి ♦ జ్ఞానముగల్గదొకించుకేని యున్।
మోదముతోడుతం జెవిటి ♦ ముందఱ శంఖముఁజాలగట్టిగా।
నూదిన దానివల్ల ఫల ♦ ముండునె చెప్పుము వేంకటేశ్వరా॥

చ॥ సురుచిర రూపముండినను ♦ సూనృత వాక్య విహీనుఁడౌట
చేఁ। బురుషుఁ డొకప్పుడేనియును ♦ బూజ్యతఁ బొందఁడు కాఁ
డ దెట్లనం। బరిమళహీనకింశుక ను ♦ మంబుసపుష్పితు నన్న
హానె సుం। దరతరరక్తవర్ణమును ♦ దాల్చిననయ్యది వేం
కటేశ్వరా॥ 98

చ॥ వితత దిగంతకీర్తినభి ♦ వృద్ధిని బొందఁదలంచునట్టి భూ। ప
తిపరిపంధిసంఘమును ♦ బాహుజశక్తి నడంపఁగావలెన్। స
తతము నబ్జబాంధవుఁడు ♦ చండగభస్తులచేత ధ్వాంత సం।
హతినడఁగించి యభ్యుద ♦ ముందుచునుండడె వేంకటేశ్వరా॥

చ॥ సతతము ధీరపుంగవుని ♦ శత్రుపుబాధలు పెట్టుచున్న ధీ। ర
తను వహించుఁగాని మఱి ♦ తత్సము నొందక యుండునా

తేఁడా। తతజవసత్వ నిస్స్వనయు • తంబుగ వాయువు వీవఁ
జొచ్చినన్ । ధృతిచెడియద్రిరాజము చలించునె యెన్నఁ
డు వేంకటేశ్వరా॥ 100

చ॥ పరమమనీషులౌ సుకవి • వర్యుల వేఁడద భక్తితోడ శ్రీ। కర
మగు నేను జేయు శత • కంబున నొప్పులనే గ్రహింపఁగాని
రుపమదుగ్ధనీరములు • నిర్మలమౌనొక పాత్రినుండ నా। ద
రమున హంసక్షీరమును • దానుగ్రహింపదె వేంకటేశ్వరా॥

చ॥ స్థిరతరబుద్ధితోడుత వి • ధేయుఁడనై ప్రతిపద్యమందు నీ।
సరసపవిత్రనామమిడి • సచ్ఛతకంబును బూర్తిచేసి యా।
దరమున నీకు నంకితము • తప్పక యిచ్చితి స్వీకరించికన్। గ
రుననుబూనినీవు తగఁ • గావుమ తిర్పతి వేంకటేశ్వరా॥ 102

